ఓం.

# కోదండరామ శతకము




రచయిత:

గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా

దమ్మాలపాడు గ్రామనివాసి

యగు

ప్రత్తిపాటి ముక్తేశ్వరదాసు.





బెజవాడ, ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1935

ఓం.

# కోదండరామ శతకము.




రచయిత:

ప్రత్తిపాటి ముక్తేశ్వరదాసు.





నైజాం నల్లగొండనివాసులగు భక్తమండలి

ద్రవ్యసహాయముచే

బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలలో

సచ్చోప్తింపఁబడియె.

1935.




[ వెల రు 0-2-0.

సహృదయు లగు పాఠకులారా!

భాషాజ్ఞాన మత్యల్పమైనను భగవల్లీలాభినంద నాభిలాష యుత్కటంబగుటచే నాకొలఁది నేవో కొన్ని పద్యములను అప్పుడప్పుడు రచించితిని. వాని నన్నిటిఁగూర్చి యిప్పుడు శతకముగా లోకమునకు నివేదించుకొన్నవాఁడను. ఇందలి గుణ లేశములను గ్రహింపఁ బ్రార్థించువాఁడ.

ఇట్లు సుజనవిధేయుఁడు,

గ్రంథకర్త.

# భూమిక.



భక్తిజిజ్ఞాసువులారా!

శ్రీపరబ్రహ్మానందస్వరూపమిళితలలితాంతర్గతప్రణవనినాదోద్భూత భూతాన్వితత్రిగుణాత్మకప్రాధాన్యాన్యానుసంధానక్రమామ్నాయవిహితజప తపోధ్యానాభిరామ శ్రీరామనామ మెంద రేకీతి వర్ణించినను తనివి తీర దనుట ,కీ చరిత్రకారుడును యొకసాక్ష్యమే. ముక్తికి సాధన మను భక్తిపారవశ్యముచే బొరలెడి వాక్కు లొక్కొక్కరియం దొక్కొక్క రస ముట్టిపడఁ జేయుచుండును. కాని యెవ్వారికిని సర్వరసోచితోత్కృష్టభావ మెలకదుకదా! శక్తిసామర్థ్యముల కొంచును వంచన నొకించుక నుంచ నెంచని సముచితకార్యభారకుఁ డగు యీకవి సహజపాండిత్యోభయభాషాపరిచయుఁ డన చదువరుల తలంపుల కింపునింపు ప్రకృతార్థభావ పదాడంబర వేదాంతార్థావరిత మహాభావపూరితభక్తిరసప్రధానముగ రచించె ననియే చెప్పనగును. నవీన కవనానుకూలజనితదోషములచే వలసినంతవర ఉపమానోపమేయాలంకార బాహుళ్యసాహిత్యలక్షణపదార్థసంపద లంతగఁ బొడలఁ జేయకున్నను పునఃకావ్యవిరచితప్రయత్నానుసంధానమం దైనను పూర్ణ విజయప్రాప్తి నందఁగలఁడు. చిరపరిచితసహచరుఁ డగుటంజేసి తన గ్రంథరచనయందలి దోషవిమర్శనాభారమును మదొదల నిడ నాల్చి యచ్చటచ్చటం గల లోటుల బాటొనరించితిని. ఐనను "ప్రమాదో ధీమతా మపి" యను సూత్రమున కనుగుణములై వర్తిలక మానదుగదా!

మ॥ భగవత్తేజములై వెలుంగు గుణము ♦ ల్భ్రాంతిస్వరూపంబునన్
వగవం జెల్లదు వారివారి సుగుణ♦వ్యాపార మొక్కొక్కరీ
తిగ వర్ధిల్లు నహంకృతిం బరుల నిం♦దించంగ గర్వించఁగన్
దగ దెవ్వారిలఁ దప్పుత్రోవఁ దగునం♦తన్ లేక యున్నారలే.

ఇట్లు భక్తవిధేయుఁడు,

దమ్మాలపాటి కేశవరావు,

15—5—1933.

## విష్ణుస్తుతి.

శా॥ శ్రీవక్షస్థలధాము భోగిశయనుఁ ♦ క్షీరాబ్ధివాసుఁ హరిఁ
భావాతీతు పరాత్పరుఁ భవహరుఁ ♦ భక్తాళిసంరక్షకుఁ
గోవిందుఁ యదువంశవార్ధిశశిఁ ♦ గోపాలచూడామణిఁ
భావంబందుఁ దలంతుమామకకవి ♦ త్వప్రౌఢి బెంపొందఁగన్.

## శివస్తుతి.

ఉ॥ ఈశ్వర సర్వసాక్షి జగ ♦ దీశ్వర భక్తజనానుమోద స
ర్వేశ్వర మారహంతక మ ♦ హేశ్వర నిత్యజనానుమోదభూ
తేశ్వర కోర్కె లిచ్చు పర ♦ మేశ్వర సత్కృపఁ గావవే నను
శాశ్వతకీర్తి నిచ్చి ముని ♦ సన్నుత బాలశశాంక శేఖరా!

## బ్రహ్మస్తుతి.

కం॥ ధర్మ మెఱింగి క్రమం బగు
కర్మల కనుగుణ్యజన్మ ♦ గల్గించెడి స
ద్ధర్మ శతధృతి ననయము
నిర్మలమతి గొల్తు కవిత ♦ నేర్పు నిడంగన్.

## సరస్వతిస్తుతి.

మ॥ పరమేష్ఠిప్రభురాణి వాగ్జనని స ♦ న్మాగొప్ప వీక్షించి స
త్వరతన్మత్కృతగ్రంథపద్యములయం ♦ దర్థంబుభావంబునుఁ
తిరమైయొప్పునటుల్ త్వదీయకరుణా ♦ దృష్టిం బ్రసాదించి మేల్
[illegible]

## విఘ్నేశ్వరస్తుతి.

గీ॥ కార్యముల నాది గొల్తు వి◆ఘ్నములఁ బాప
నను ముదంబునఁ గన గజా◆నన! సహాయ
పడుము రసవంత మగు వచో◆భావ మొదవి
తారచంద్రార్క మగు కీర్తి ◆ దనరునట్లు.

## సుకవిస్తుతి.

చ॥ గురువుగ కాళిదాసకవిఁ◆గొల్చి మయూరుని మాఘు బాణునిన్
స్థిరమతి నెంచి నన్నయను◆తిక్కన సోము తెనాలిరామునిన్
వరకవితాపితామహుని ◆ వాగ్బటు వేములవాడభీము నె
త్తరి నుతియింతుఁ బద్యములు◆ధైర్యముతో మతి జెప్పఁగా
మదిన్.

## గురుస్తుతి.

సీ॥ అక్షరాభ్యాసంబు ◆ నలవరించిన పీస
పాటి వేంకటరమణుఁ ◆ బ్రథముఁ గొల్చి
తెలుఁగు కావ్యములు బో◆ధించిన దమ్మాల
పాటి కోటీశ్వరుఁ ◆ బ్రస్తుతించి
లక్షణశాస్త్రంబు ◆ శిక్షసల్పిన ప్రత్తి
పాటి కామేశ్వర ◆ మేటికవికిఁ
బ్రణతు లొనర్చి నా ◆ ప్రియస్నేహితుని తుమ్మ

గీ॥ గవితఁ జెప్పు మటంచు న ♦ గ్గనిన వేళ
ధైర్యమును గూర్చి సత్కీర్తిఁ ♦ దనరినట్టి
శ్రీపట్టాభికులాంభోధి ♦ విధుసమాను
కోట యాహ్వయు స్థిరమతి ♦ న్గొలుచువాఁడ.

## ఇష్టదేవతాస్తుతి.

సీ॥ కవితకు వలయు వ్యా ♦ కరణ సులక్షణ
సారవిచారంబు ♦ సలుప లేదు
పదగుంభనకు మేలు ♦ పడఁగల భాష న
భ్యాసంబు నంత చే ♦ యంగ లేదు
శృంగారవైఖరి ♦ చేత మెప్పించ న
లంకారశాస్త్రంబు ♦ లరయలేదు
పరికృతార్థభావసం ♦ బంధము దిలకింపఁ
దగినజ్ఞానంబు నా ♦ దరిని లేదు

గీ॥ కాని నీనామపఠనవి ♦ కాసమతి న
టింపఁగల్గినయట్టి పాం ♦ డిత్యమునను
నిన్నుఁ గోదండరాముని ♦ సన్నుతింపఁ
శతకమును వ్రాయుచుంటి నా ♦ చాయఁ జూడు.

ఓం.

# కోదండరామ శతకము

## ప్రారంభము.

గీ॥ శ్రీరమేశ హృషీకేశ • చిత్ప్రకాశ
రామ రణభీమ సుగుణాభి•రామ భవవి
రామ నీ కిదె పద్యముల్ • ప్రేమ గొనుమ
దండనావనకామ కో•దండరామ! 1

గీ॥ ధాతతలక్రింద నుండిన • తరిని వేద
ములను మ్రుచ్చిలు దైత్యు సో•ముకు వధించ
మత్స్యరూపంబు దాల్చిన • మాననీయ
దండనావనకామ కో•దండరామ! 2

గీ॥ దేవతానీకముల కెల్ల • దితిసుతులకుఁ
‘క్షీరసంద్రింబుఁ దరచఁగా • జెలఁగు నమృత’
మనుచు వచియించినట్టి మ•హానుభావ!
దండనావనకామ కో•దండరామ! 3

గీ॥ భూధరమ్మును కవ్వముఁ • భోగి ద్రాడుఁ
గాఁగ సురల నసురులను • గలిపి యుదధి
దరువఁ బురికొల్పినట్టి శ్రీ•ధరుఁడ వీవ
దండనావనకామ కో•దండరామ! 4

గీ॥ అసురులును దేవతలుఁ గూడి ♦ యైకమత్య
మునను మున్నీరుఁ దరువఁగా ♦ మునుఁగు నగము
వీపుమోఁపున నోపు తాఁ♦బేటిరూప !
దండనావనకామ కో♦దండరామ ! 5

గీ॥ వార్థిఁ దరువంగఁ బుట్టిన ♦ పరమసాధ్వి
పావని శుభాంగి సౌభాగ్య ♦ భాగ్యలక్ష్మి
నైకగుణఖని శ్రీమనో♦నాయకుఁడవు
దండనావనకామ కో♦దండరామ ! 6

గీ॥ దైత్యవంశంబునం బుట్టి ♦ ధరణి చాపఁ
గాఁగఁ జుట్ట హిరణ్యాక్షు♦గం డడంచి
రసనుఁ బ్రోచిన యాదివ♦రాహ మీవ
దండనావనకామ కో♦దండరామ ! 7

గీ॥ నారసింహావతారంబు♦నన్ హిరణ్య
కశిపుఁ దెగటార్చి బ్రహ్లాదుఁ ♦ గరుణఁ గాఁచి
భక్తవరదుఁడ వని ఖ్యాతి ♦ బడసి తీవ
దండనావనకామ కో♦దండరామ ! 8

గీ॥ వామనాకృతి దాలిచి ♦ బలిని త్రిపద
దానమును గోరి వాని పా♦తాళమునకు
నణఁగఁ ద్రొక్కియు సురల కా♦నంద మిడిన
దండనావనకామ కో♦దండరామ ! 9

గీ॥ కుశికసుతయాగరక్షణ ♦ కొఱకుఁ బోవు
తరిని దారిని వసియించు ♦ తాటకిని వ

ఘించి శూరులలోనఁ గీ•ర్తింపఁబడితి
దండనావనకామ కో•దండరామ ! 10

గీ॥ గాధినందను యజ్ఞంబు • పాదుకొల్ప
వేగ జనుదెంచి రాక్షస • వీరుల ధర
ద్రెళ్లఁజేసిన యామహా•దేవుఁ డీవ
దండనావనకామ కో•దండరామ ! 11

గీ॥ జన్నమును గాచి మునితోడ • జనకజస్వ
యంవరమ్మున కరిగి ర•యమ్మున శివు
విల్లువిరచియు జనకజన్ • బెండ్లియాడు
దండనావనకామ కో•దండరామ ! 12

గీ॥ జనకు నాజ్ఞను దాల్చి రా•జ్యమును వీడి
సీతతోడుతఁ గానన • సీమఁ జేరి
నట్టి మహానీయమూర్తివి • యరయ నీవె
దండనావనకామ కో•దండరామ ! 13

గీ॥ విపినమందున నివసించు•వేళఁ గామ
రూపమున లేడియై సీత • ప్రాపు జేరు
ఖలుని మారీచుఁ జంపి లో•కమ్ముఁ బ్రోచు
దండనావనకామ కో•దండరామ ! 14

గీ॥ దుష్టుఁడౌ పంక్తికంఠుండు • దొంగతపసి
వేసమున వచ్చి భూమిజన్ • వే హరింపఁ
బ్రకృతినటనకునై యార్తి • బడితివౌర !
దండనావనకామ కో•దండరామ ! 15

గీ॥ సీతఁగానక గోదావరీ◆సీమలందు
వెదకుచుండిన [illegible]ల ◆ విప్రవేష
మున నెఱింగిన యాంజనే◆తనయుతోడ
జేరి సుగ్రీవమైత్రిని ◆ జేసినట్టి
దండనావనరామ కో◆దండరామ ! 16

గీ॥ దుష్టబుద్ధిని వాలిని ◆ దునిమి రాజ్య
పదవి సుగ్రీవునకు నిచ్చి ◆ ప్రీతిగ సీత
జాడ గనుగొన నాతని ◆ సాయ మంది
హనుమదాదుల వెదుకఁగా ◆ నంపినట్టి
దండనావనరామ కో◆దండరామ ! 17

గీ॥ దక్షిణాపథవర్తియై ◆ తరలి వార్ధి
దాటి లంకిణిఁ గూల్చి సీ◆తమ నెఱింగి
క్షేమమును దెల్పు పవనాత్ముఁ ◆ బ్రేమ గనిన
దండనావనరామ కో◆దండరామ ! 18

గీ॥ హనుమదంగదజాంబవం ◆ తాదికపుల
తోడ నంబుధి దాట సే◆తువు నొనర్చి
లంకఁ జేరియు దశకంఠు ◆ బింక మడఁచు
దండనావనరామ కో◆దండరామ ! 19

గీ॥ కరి మకరిచేతఁ జిక్కిన ◆ కాలమందు
నిన్ను ధ్యానించ ద్విపముచే ◆ నేర్పుచేతఁ
గాచి మొసలిని ద్రుంచిన ◆ ఘనుఁడవైన
దండనావనరామ కో◆దండరామ ! 20

గీ॥ సురుచి మర్మాపలాడిన • శోకాతురుఁడుగఁ
గర్ణముల నాట విముఖతఁ • గాననంబుఁ
జేరి విలపించు ధృవుఁ బ్రోచి • శౌరి వీవ
దండనావనకామ కో•దండరామ! 21

గీ॥ భర్తచే శాపము నొంది • పతితయైన
యాయహల్యకు నీచర•ణాంబుజాత
రజము సోఁకఁ బవిత్రయై • రమణి యయ్యె
దండనావనకామ కో•దండరామ! 22

గీ॥ సురలు రక్కసులాదిగ • జోద్యమంద
నమృతమును బంచిపెట్టఁగ • నాఁడు నీవు
మోహినీదేవి వైతివి • ముదముతోడఁ
దండనావనకామ కో•దండరామ! 23

గీ॥ అట్టిచో రాహు వను నొక • యసుర సురల
పంక్తి నమృతంబుఁ గొనఁబూను • పాటెఱింగి
చక్రమునఁ దున్మిచ సురలు బ్రో•వన్నులైరి
దండనావనకామ కో•దండరామ! 24

గీ॥ దండకారణ్యభూముల • కొండగుహల
యందు నివసించు మునిజన•బృందహృదయ
ఫలకమందున నివసించు • భక్తవరద!
దండనావనకామ కో•దండరామ! 25

గీ॥ సభను పూజింపఁబడ నీవు • చాల వనుచు
నిరసనోక్తులనాడిన • నీచుని శిశు

పాలుఁ జక్రించుచేఁ గూల్చు • ప్రభుఁడ వీవ
దండనావనకామ కో•దండరామ ! 26

గీ॥ పుడమిపాలురదుండగం•బుల నణంచఁ
బరశురాముఁడవై వారి • నిరువదొక్క-
సారి చెండాడి ధర్మ ర•క్షణముఁ సల్పు
దండనావనకామ కో•దండరామ ! 27

గీ॥ తోడిబాలురతోఁగూడి • క్రీడసలుపు
వాని సుడిగాలియై తృణా•వర్తుఁ డుఱక
నిన్నుఁ గొనిపోవఁ బట్టి యా•నీచుఁ జంపు
దండనావనకామ కో•దండరామ ! 28

గీ॥ మన్ను దినుచుండవల దని • మాత బలికి
నోరు దెరువు మటన్న నా•నుడులు వినుచు
బొజ్జలోపలి బ్రహ్మాండ•ములను జూపు
దండనావనకామ కో•దండరామ ! 29

గీ॥ దుష్టుఁడై నట్టి కంసుని • దునిమి వాని
జనకుఁ డగు యుగ్రసేను రా•జ్యమును నేల
సలిపి నటునంటి వీర సిగ • సన్నుతింతు
దండనావనకామ కో•దండరామ ! 30

గీ॥ గోపకులఁ గూడి గోవుల • మేపునపుడు
నీమహిమఁ జూడ నిర్జర•నేత రాల
వానగురిపించ నగ మెత్తు • బాహుశాలి !
దండనావనకామ కో•దండరామ ! 31

గీ॥ పాండవులలోన మేటియగా ♦ ఫల్గునునకు
నీదు చెల్లెలు పతిగాఁగ ♦ నెఱపి స్నేహ
మందితివి నీవు ప్రాణస♦మంబుఁ జూపి
దండనావనకామ కో♦దండరామ ! 32

గీ॥ ద్రౌపదిని దుస్ససేనుఁడు ♦ తగనిబాధఁ
బెట్టి కట్టినపుట్టముల్ ♦ బట్టి రొయిలువ
నక్షయ మటంచుఁ బరిభవ ♦ మాపినట్టి
దండనావనకామ కో♦దండరామ ! 33

గీ॥ వాసవుని గెల్చి మానులఁ ♦ బరిభవించి
మురనిశుంభులలో సుర♦పురము నేలు
నరకుఁ ద్రుంచియు జిష్ణుని ♦ గరుణఁ గాఁచు
దండనావనకామ కో♦దండరామ ! 34

గీ॥ అటుకులను గొని నీమిత్రుఁ ♦ డగు కుచేలుఁ
డరుగుఁదెంచినఁ బ్రేమచే ♦ నవి భుజించి
సిరులు చేకూర్చి బ్రోఁచిన ♦ శ్రీనివాస !
దండనావనకామ కో♦దండరామ ! 35

గీ॥ దుష్టనృపులను జంపఁగాఁ ♦ దొల్లి పార్థు
నకును సారథివై యుండి ♦ సకలరాజ
వరులఁ బరిమార్పఁ జేయు ధీ♦వరుఁడ వీవు
దండనావనకామ కో♦దండరామ ! 36

గీ॥ ఉత్తరాగర్భమందున ♦ నున్న శిశువుఁ
జంపఁ ద్రోణకుమారుఁడు ♦ బంపు నస్త్రు

మును మరలఁజేసి బాలు నిం◆బొదవఁ గాంచు
దండనావనకామ కో◆దండరామ ! 37

గీ॥ జనన మొందింప బ్రహ్మనా ◆ జగతియందుఁ
పోషణ మొనర్ప విష్ణునాఁ ◆ బొలయఁ జేయ
హరుఁ డనఁ ద్రిమూర్తు లివెగా ◆ యబ్జనాథ !
దండనావనకామ కో◆దండరామ ! 38

గీ॥ శబరి యను నాతి నిన్నెప్డు ◆ స్మరణఁ జేయు
చుండి భక్తితో నెంగిలి◆పండు లివ్వ
భక్షిగ మొనర్చి మోక్షంపు◆పదము నీవె
దండనావనకామ కో◆దండరామ ! 39

గీ॥ జనకజను గొని చను రావ◆ణుని నెదిర్చి
పోరి రెక్కలఁ గోల్పోయి ◆ భువిని బడియు
వార్తఁ దెల్పిన పక్షికి ◆ బరము నిడిన
దండనావనకామ కో◆దండరామ ! 40

గీ॥ మున్ను కురుక్షేత్రసంగ్రా◆మమున కలిత
భీతినొందిన పార్థుండు ◆ వెరువకుండ
గీతలను దెల్పి పురికొల్పు ◆ నేత వీవ
దండనావనకామ కో◆దండరామ ! 41

గీ॥ గోపకులఁగూడి గోవుల ◆ మేపుచున్న
తరిని మహిమంబుఁ గన ధాత ◆ తద్గణమును
మాయఁజేయఁగ సకలమా◆ మాయకాడ
దండనావనకామ కో◆దండరామ ! 42

గీ॥ దేవహూతికి సుతుఁడవై ♦ దివ్యజ్ఞాన
దృష్టి యొసఁగూడ దల్లికి ♦ నిహపరములఁ
దెలియఁజేసిన మహనీయ♦దివ్యతేజ!
దండనావనకామ కో♦దండరామ! 43

గీ॥ పరశురాముని గర్వంబు ♦ భంగపరుప
వైష్ణవం బను ధనువుఁ జేఁ♦బట్టి వాని
పుణ్యలోకంబుఁ గొనినట్టి ♦ మూర్తి వీవ
దండనావనకామ కో♦దండరామ! 44

గీ॥ సంయమీంద్రులు గోరఁగాఁ ♦ జని ముదమున
త్మాతలిని గోవుఁ జేసి యో♦షధులఁ బితుక
మున్ను పృథుచక్రవర్తివై ♦ బుట్టి తీవ
దండనావనకామ కో♦దండరామ! 45

గీ॥ లోకకంటకు లౌచు ము♦ల్లోకములను
బాధలం బెట్టి జన్నముల్ ♦ బాడొనర్చి
నట్టి రాత్రించరాదుల ♦ మట్టుఁబెట్టు
దండనావనకామ కో♦దండరామ! 46

గీ॥ కులము నభిమాన మెన్నక ♦ గుణవిలాసి
కుబ్జ యను నాతి స్తోత్రంబుఁ ♦ గుహుని సేవఁ
గొంచు మోక్షంబు నీయవే ♦ కోర్కెలలర
దండనావనకామ కో♦దండరామ! 47

గీ॥ కులము గోత్రంబు లెన్నితే ♦ గుణవిభూష!
గోపకుల మేది వానర♦కుల మదేది?

వారి నిహముున నీసఖ్య◆వార్థి దేల్చి
తుదను మోక్షంబు లియ్యవే ◆ తోయజాక్ష !
దండనావనకామ కో◆దండరామ ! 48

గీ॥ ము న్నజామిళుఁ డనునట్టి ◆ మూర్ఖుడు తన
పట్టికిని నీదుపే రిడి ◆ పలుకఁ బరమ
పదవి నీయవె నా కట్టి◆భాగ్య మిమ్ము
దండనావనకామ కో◆దండరామ ! 49

గీ॥ కరిని రక్షించుట, హిరణ్య◆కశిపు మును వ
ధించి ప్రహ్లాదుఁ గాచుట ◆ దేవ ! నిజము
గావు; నను గాచు టగును ని◆క్కంబు రామ !
దండనావనకామ కో◆దండరామ ! 50

గీ॥ అంజనీపుత్రుఁడైన వీ◆రాంజనేయుఁ
డతులితంబైన భక్తి నీ◆యందుఁ జేర్చి
నీదుసాన్నిధ్యమును జేరె ◆ నిశ్చయముగ
దండనావనకామ కో◆దండరామ ! 51

గీ॥ కల్మషాంచితజగతి స◆ద్గతిని జొన్ప
తేజి నెక్కి కరాసిచే ◆ దీటులేని
వీరరస మొల్క కుజనగ◆భీర మడఁచి
బోవ నున్నావు కలిరూప◆మును ధరించి
దండనావనకామ కో◆దండరామ ! 52

గీ॥ దేవతలు వేడగా మును ◆ త్రిపురకాంత
లను దయను గన బుద్ధమూ◆ర్తిని ధరించి

త్రిపురరాక్షససంహార • ధీరుని న్వారు
విల్లు నమ్ములచేఁ బోర • వీలుగొల్పు
దండనావనకామ కో • దండరామ ! 53

గీ॥ కుజననాశనకారణ • గోపకులశ
శాంకుఁ గృష్ణాగ్రజుఁడ వన • యగణితభుజ
దర్పమును గల్గి రోహిణీ • తనయుఁడ వయి
యిలను రక్షణఁ జేసిన • బలుఁడ వీవె
దండనావనకామ కో • దండరామ ! 54

గీ॥ ప్రణవనినదజ సుగుణసం • భవుఁడవైన
సచ్చిదానందభావసం • చాతురీస్వ
రూపకృపఁ గూల్చు నాదు దు • ర్గుణసమితిని
దండనావనకామ కో • దండరామ ! 55

గీ॥ సృష్టిపోషణలయములం • దృష్టి నొందు
య్యాదిదేవుఁడ వనియును • యచలుఁడ వని
నిండుపరిపూర్ణుఁ డని చెప్పు • చుండె స్మృతులు
దండనావనకామ కో • దండరామ ! 56

గీ॥ ఆత్మపరమాత్మభేదంబు • లందు నీవ
యంతరాత్ముఁడవును బ్రత్య • గాత్మ వీవె
యగుట రెంటికి భేదంబు • తగని దగును
దండనావనకామ కో • దండరామ ! 57

గీ॥ భూజలానలయునిలన • భోద్భుజమ్ము
లైన వ్యష్టిసమష్టిభా • గాళి నిరువ

ద్వైదు తత్వారబాలురా జీవ • మమతఁ జేయు
దండనావనకామ కో • దండరామ ! [illegible]

గీ॥ ఇలను నెనుబది నాల్గులౌ • క్షలుగ జీవ
కోటిభేదంబులను సమ • కూర్చి వాటి
కర్మ కనుకూలజన్మలఁ • గలుగఁజేయు
దండనావనకామ కో • దండరామ ! 59

గీ॥ బ్రిహ్మవిష్ణుమహేశరూ • పములఁ దాల్చి
సృష్టి రక్షింప శిక్షింపఁ • జేయుచుండి
విశ్వలీలాంతరాయాత్మ • వెలయునట్టి
దండనావనకామ కో • దండరామ ! 60

గీ॥ సర్వకర్తృత్వభోక్తృత్వ • శక్తి గల్గి
సర్వరక్షణశిక్షణల్ • జరుపఁజాలు
సర్వసాక్షివి విమలవి • శాలహృదయ !
[illegible] కో • దండరామ ! 61

గీ॥ షడ్గుణవికార చోరుల • సరసఁ గూడి
పంచభూతాళి కావల • మించియున్న
జ్యోతి త్వత్కళ యంచు నీ • బ్రీతిఁ గనని
వానిజన్మంబు వృథగాదె • వాసుదేవ !
దండనావనకామ కో • దండరామ ! 62

గీ॥ ఆదిమధ్యాంతశూన్య య • నాదిపురుష
వేదవేదాంతవేద్య య • భేద్యరూప
త్రిగుణకారణధామ శ్రీ • రామనామ
దండనావనకామ కో • దండరామ ! 63

గీ॥ శబ్దరసరూపగంధస్ప♦ర్శములతోడ
నైదు జ్ఞానేంద్రియంబుల ♦ నమరఁజేసి
జీవపోషణ లొనఁగూర్చు ♦ చిద్విలాస
దండనావనకామ కో♦దండరామ !

గీ॥ సకలజీవులకు జనక♦సముఁడవైన
నిన్ను భజియించువాఁడను ♦ నిక్కముగను
గాన దాసుని మొరను స♦త్కరుణ దీర్చు
దండనావనకామ కో♦దండరామ ! 65

గీ॥ చిత్తమంతయు నీయందుఁ ♦ జేర్చి ద్వాద
శాబ్దములు గడచిన ని♦జంపుదారిఁ
జూపకుండితి విధియేమి ♦ చోద్యమయ్య !
దండనావనకామ కో♦దండరామ ! 66

గీ॥ భారమంతయు నీపైని ♦ బారవైచి
భక్తిశ్రద్ధాగరిష్ఠులఁ ♦ బవలుఁ రేలుఁ
మానము న్దాల్చి నీదునా♦మంబుఁ దలఁతు
దండనావనకామ కో♦దండరామ ! 67

గీ॥ క్షీరసాగరశయన ల♦క్ష్మీకళత్ర
బుధజనస్తోత్ర కారణ♦పురుష నీవు
జాగుసేయుట యికనైన ♦ మఱియుఁ గనఁగ
దండనావనకామ కో♦దండరామ ! 68

గీ॥ ఆర్తరక్షాపరాయణా ♦ యఘవిదూర
యనుచు మొరవెట్టినను మంత♦ కనికరంబు

జూపవైతివదేమొకో ♦ చోద్యమయ్యె
దండనావనకామ కో♦దండరామ! 69

గీ॥ ఎంతవేడిన నీ కింత ♦ వంత మేల?
సుంత దయతోడ దాసుని ♦ స్తోత్రములను
వినుము వినకున్న దిక్కెవ్వ ♦ రనఘమూర్తి
దండనావనకామ కో♦దండరామ! 70

గీ॥ నీదు సేవలఁ జేయఁగా ♦ నెంతుఁగాని
బీద నాదరిఁ బరికింప ♦ లేదు ధనము
సలుప ధర్మార్థకామ మో♦క్షముల నిలను
దండనావనకామ కో♦దండరామ! 71

గీ॥ చేసితిని మున్ను నేకముల్ ♦ జెడుగుపనులు
చేయుచుంటిని నీపద♦సేవ నిపుడు
గాన గతమును నెన్నకఁ ♦ గరుణఁ బ్రోవు
దండనావనకామ కో♦దండరామ! 72

గీ॥ మూఢుఁడను జ్ఞానహీనుండ ♦ ముక్తిమార్గ
మరయఁజాలని పాపియుం ♦ దలఁచువాఁడ
యేడ నీజాడ జూపు నీ♦వాఁడ ప్రోద
దండనావనకామ కో♦దండరామ! 73

గీ॥ ఎందరిని బ్రోచితివొ మున్ను ♦ కెందరి నటు
బ్రోవ నున్నావొ తద్గతిఁ ♦ గావు నన్ను
వారియందరివలెనె నీ♦వాఁడ నందు
దండనావనకామ కో♦దండరామ! 74

గీ॥ శుక్ల శోణితములచేత • శోభఁ గాంచి
యండపిండాండమై యోని•గుండ వెడలు
మాయకాయంబునందలి • మమతఁ బాపు
దండనావనకామ కో•దండరామ ! 75

గీ॥ గరుడవాహన నన్ను ని•ష్కరుణఁ దలఁచ
నేల ? నీభక్తునిగ మది • నెంచుమయ్య
నాదు చెడుగుల నెన్నఁగా • న్యాయమగునె
దండనావనకామ కో•దండరామ ! 76

గీ॥ సగుణనిర్గుణభావను • ర్తగపడమిని
గుణునిగాఁ జేసి దోసముల్ • గ్రుమ్మరించు
చుంటి నని యాగ్రహం బూన • కుండుమయ్య
దండనావనకామ కో•దండరామ ! 77

గీ॥ దారిగానక పలురీతిఁ • దమకపడుచుఁ
గాల మెల్లను వృథగాఁగఁ • గడుపుచుంటి
గాన భవదీయచిత్కళఁ • గాంచఁజేయు
దండనావనకామ కో•దండరామ ! 78

గీ॥ కులము నభిమాన మేహ్యంబు • మలినతనము
దూషణలు భూషణలు దుఃఖ•శోషములను
సమతఁ గనఁ భక్తకోటి ర•క్షణముఁజేయు
దండనావనకామ కో•దండరామ ! 79

గీ॥ కర్మకుఁడ వీడఁజాలఁ దు•ష్కర్మసమితిఁ
దన్నివారణకై మదిఁ • దలఁచుచుంటిఁ

పాలనో నీళ్లనో మంచు • నీర మిడుదు
దండనావనకామ కో • దండరామ ! 80

గీ॥ మద్గుణాన్వితకర్మలన్ • మఱగుచున్న
తుచ్ఛసుఖములయం దిచ్ఛ • తొలఁగి తుదిని
మీపదార్చన సలిపెడి • ప్రాపు దొరకె
దండనావనకామ కో • దండరామ ! 81

గీ॥ ఎల్లవిధముల నీనామ • మే జపించు
టహరహంబును జీవుని • కర్త్వ్య మగు న
టంచు నీనామ మెదను ద • లంచుచుందు
దండనావనకామ కో • దండరామ ! 82

గీ॥ భూషితంబులచేతను • బొర్లి బొర్లి
దూషితంబులఁ గనినంత • దొర్లి దొర్లి
మోదదుఃఖాంబుధులలోన • మున్గి తేలి
వాటఁ జిక్కితి నిల దిక్కె • పాటిజోలి
దండనావనకామ కో • దండరామ ! 83

గీ॥ సహజ కలిబాధలకుఁ దాళఁ • జాలఁ జెడితి
జన్మదారభవ్యసంగతి • సంగదోష
ములను జిక్కుచుఁ గష్టకా • ములను గొనుచు
దండనావనకామ కో • దండరామ ! 84

గీ॥ సలలితానంద నీనామ • జపవరంబు
బంధురాంధకారమోహాద • పావకంబు

గాఁగ వర్తిలు జీవసం♦స్కరణమందు
దండనావనకామ కో♦దండరామ ! 85

గీ॥ శ్రీలఁ బుత్త్రుల మిత్త్రులఁ ♦ జేరనొల్ల
నతులితంబైన సౌఖ్యంబు ♦ లంద నొల్ల
నందఁజేయుము నీపదా♦నందసేన
దండనావనకామ కో♦దండరామ ! 86

గీ॥ భద్రగిరివాస భక్తహృ♦త్పద్మభృంగ
శ్రీవరోద్ధితగుణకల్ప ♦ శ్రీనివాస
జానకీనాథ రఘువంశ♦జలధిసోమ
దండనావనకామ కో♦దండరామ ! 87

గీ॥ కర్మ లెంచెదవేని దు♦ష్కర్ముఁ డగుదు
గుణము లెంచెదవేని దు♦ర్గుణుఁడ నిజము
యైన భవదీయదాసుగా ♦ నెంచి బ్రోవు
దండనావనకామ కో♦దండరామ ! 88

గీ॥ ఎంత మొఱపెట్టినను మౌన ♦ మే వహించి
బలుకకున్నావు నీ కిది ♦ భావ్య మగునె ?
పరులవలెఁ జూడఁగా నను ♦ బాడిగాదు
దండనావనకామ కో♦దండరామ ! 89

గీ॥ నీదుపదసేవ వ్రతముగ ♦ నీదు ధ్యాన
మే తపంబుగ నీనామ♦మే జపించు
మంత్రముగ నాచరించెద ♦ మహితభక్తి
దండనావనకామ కో♦దండరామ ! 90

గీ॥ తల్లిదండ్రియు గురువును • దైవమిత్ర
బంధువులు కల్ల లంచును • ప్రకృతివిషయ
సౌఖ్యముల వీడినాఁడ నీ•సరసఁ జేర
దండనావనకామ కో•దండరామ ! 91

గీ॥ ఐహికసుఖంబులం దెట్టి•యాస లేదు
యాసపొడమెను ని న్గాంచ • నతిశయముగ
నెటులఁ దీర్చెదొ దాసుని • యీప్సితముల
దండనావనకామ కో•దండరామ ! 92

గీ॥ నిర్వికార నిరంజన • నిష్కళంక
నిర్గుణ బ్రహ్మ సర్వేశ • నిర్వికల్ప
మామకదురంతదుర్గుణ•కామలతలఁ
ద్రెంచి బ్రోవఁగ వేడెద • దివ్యతేజ
దండనావనకామ కో•దండరామ ! 93

గీ॥ జపతపంబులకన్నను • సాంద్రగహన
మందు ధ్యానించి గృశతను • బొందుకంటె
నీదునామంబె ముక్తికి • సాధనంబు
దండనావనకామ కో•దండరామ ! 94

గీ॥ నాటి కిప్పుడు దెలసె నీ•నామమంత్రి
మును జపించిన ముక్తికి • మూల మనుచుఁ
గాన ని న్నెద నమ్మితి • కరుణఁ గాంచు
దండనావనకామ కో•దండరామ ! 95

గీ॥ ఈశ సర్వేశ లక్ష్మీశ ♦ యినకులేశ
భాసమానప్రకాశ వి♦శ్వాసదాస
దాసికాపోష కేశవ ♦ వాసుదేవ
దండనావనకామ కో♦దండరామ ! 96

గీ॥ క్షీరసాగరశయన నీ♦సేవలందు
భక్తిశ్రద్ధాగరిష్ఠులఁ ♦ బరగు నాదు
చిత్తమంతయు త్వత్పదా♦యత్త మయ్యె
దండనావనకామ కో♦దండరామ ! 97

గీ॥ భక్తకల్పద్రుమా యుమా♦పతి భజించు
దేవ సుచరిత్ర శ్రీవాసు♦దేవ దేవ
వందితా బలిబంధన ♦ వందనంబు
దండనావనకామ కో♦దండరామ ! 98

గీ॥ ధాత్రి నీనామస్తోత్ర మెం♦త దనుక తిర
మగునొ మద్గ్రంథ మావిధిఁ ♦ బరగు నటులఁ
జేయు భారంబు నీకె యి♦చ్చితిని దేవ !
దండనావనకామ కో♦దండరామ ! 99

గీ॥ పదునెనిమిదిశతముల యే♦బదినయిదవ
హాయనం బగు శాలివా♦హనశకమునఁ
దనరు శ్రీముఖ చైత్ర శు♦ద్ధ నవమిని శ
తకము పూరించి నీ కంకి♦తంబు నిడితి
దండనావనకామ కో♦దండరామ ! 100

గీ॥ మౌని యాగసురక్షిత ♦ మంగళంబు
మానితౌదార్యగుణధుర్య ♦ మంగళంబు
మహితలోకైకవిఖ్యాత ♦ మంగళంబు
పరమపావనశుభగుణ ♦ మంగళంబు ! 101

ఏతత్సర్వం శ్రీరామార్పణ మస్తు.



ఓం.

# భక్తిరసస్తోత్రపద్యావళి.

శా॥ శ్రీరాజత్కమలామనోహర యశ♦శ్శ్రీ తార్క్ష్యవాహా నృసిం
హా రాజీవదళాక్ష భోగిశయనా ♦ మాం పాహి లోకేశ్వరా
రారా నీకరుణామృతం బొసఁగి నన్ ♦ రక్షింప నీకింత జా
గేరా? భక్తునిగావరా మురహరా ♦ కృష్ణా కటాక్షించరా !

చ॥ చదువులుగొంచుసోమకుడు♦సంద్రమునం దునఁడాగియుండిన
న్వడలక మత్స్యరూపమున ♦ వాని నడంగఁగఁజేసి వేడ్కఁ బ్రా
జదువుల నిచ్చి ధాతకు ని♦చారముఁబాపి జగంబుఁబ్రోచు నిన్
మదినిదలంతునిత్యమును♦మామకదుష్కృతముల్ దొలంచగన్

చ॥ చెలిమిని దేవదానవులు ♦ క్షీరసముద్రముఁ దచ్చువేళ నా
కులగిరి వార్ధి గ్రుంగు నెడఁ♦గూర్మమవై యచలంబు వీపునన్
నిలిపి సుధాప్రదానమున ♦ నిర్జరులన్ గృప నేలినట్టి యా
జలజహితాన్వయు న్దలతు♦సత్వరము న్ననుగాచువేడ్కతోన్.

చ॥ కనికర మింత లేక కన♦కాక్షుడు భూమినిగొంచు, పారఁ జూ
చినను, వరాహరూపమున♦శీఘ్రమ వానిని ద్రుంచి నిర్జరుల్
తనుఁ గొనియాడ నెప్పటివి♦ధంబున ధారుణి నిల్పు వేలుపున్
వినయముతోడఁ గొల్తుమద♦భీష్టము దీర్చగ నెల్లవేళలన్.

చ॥ సకలము విష్ణులీలయని ♦ సన్నుతి జేసెదవంచు నాహిర
ణ్యకశిపు డాత్మజున్ వ్యథల♦నారటఁ బెట్ట నృసింహరూపమె
త్తి కఠినమానసున్ దునిమి♦దివ్యపదంబును బాలుకిచ్చు పా
వకసమతేజు శ్రీహరు డ♦వారితప్రేమను నన్ను గావుతన్!

చ॥ అమలయశోన్నతిన్ బలిశు♦భాస్పదదానుని వామనాకృతిన్
సమతను వీడుచున్ త్రిపద♦స్థానము దానము గోరి విశ్వరూ
పమును ధరించి భూమినొక♦పాదము విష్ణుపథంబునందు రెం
డమరగ మూటభూతలి క♦డంచిన వాని నమస్కరించెదన్.

మ॥ ఖగరాడ్వాహన మున్ను ద్రౌపదినిదు♦ష్కౌరవ్యవంశాధముం
డగు దుశ్శాసనుఁడన్నయాజ్ఞగొని పు♦ట్టంబొల్వ బోనోహరీ
వగనేచన్ తపియింతుఁ బ్రోవుమన స♦ద్భావంబున న్నక్షయం
బగునీకంచుభయంబుమాన్పవె వధూ♦మానంబుగాపాడి నీ
దగు చారిత్రము చాట నావిధిగ స♦ద్దాక్షిణ్యతన్ జూడవే!

చ॥ కరివరదా ముకుంద వర♦కాంచనచేల వికుంఠవాన శ్రీ
ధర భుజగేంద్రశాయి పటు♦దానవహాంతక పద్మలోచనా
గిరిధర భక్తవత్సల సు♦కీర్తి సులక్షణ సుప్రసిద్ధ మా
వర సురసేవ్యమానపద ♦ వారిజ భద్రగిరీశ రాఘవా!

గీ॥ మౌని యాగసురక్షిత ♦ మంగళంబు
మానితౌదార్యగుణధుర్య ♦ మంగళంబు
మహితలోకైక కవిఖ్యాత ♦ మంగళంబు
పరమపావనశుభగుణ ♦ మంగళంబు ! 101

ఏతత్సర్వం శ్రీరామార్పణ మస్తు.



ఓం.

# భక్తిరసస్తోత్ర పద్యావళి.

శా॥ శ్రీరాజత్కమలామనోహర యశ♦శ్శ్రీ తార్క్ష్యవాహా నృసిం
హా రాజీవదళాక్ష భోగిశయనా ♦ మాం పాహి లోకేశ్వరా
రారా నీకరుణామృతం బొసఁగి నన్ ♦ రక్షింప నీకింత జా
గేరా? భక్తనిగావరా మురహరా ♦ కృష్ణా కటాక్షించరా !

చ॥ చదువులుగొంచుసోమకుడు♦సంద్రమునం దునఁడాగియుండిన
న్వదలక మత్స్యరూపమున ♦ వాని నడంగఁగఁజేసి వేడ్కఁ బ్రా
జదువుల నిచ్చి ధాతకు వి♦చారముఁబాపి జగంబుఁబ్రోచు నిన్
మదినిదలంతునిత్యమును♦మామకదుష్కృతముల్ దొలంచగన్

చ॥ చెలిమిని దేవదానవులు ♦ క్షీరసముద్రముఁ ద్రిచ్చువేళ నా
కులగిరి వార్ధి గ్రుంగునెడఁ♦గూర్మమవై యచలంబు వీపునన్
నిలిపి సుధాప్రదానమున ♦ నిర్జరులన్ గృప నేలినట్టి యా
జలజహితాన్వయు న్దలతు♦సత్వరము న్ననుగాచువేడ్కతోన్.

# భక్తిరసస్తోత్ర పద్యావళి.

చ॥ కనికర మింత లేక కన♦కాక్షుడు భూమినిఁ గొంచు, పారఁ జూ
చినను, వరాహరూపమున♦శ్రీఘ్రమ వానిని ద్రుంచి నిర్జరుల్
తనుఁ గొనియాడ నెప్పటివి♦ధంబున ధారుణి నిల్పు వేలుపున్
వినయముతోడఁ గొల్తుమద♦భీష్టము దీర్చఁగ నెల్లవేళలన్.

చ॥ సకలను విష్ణులీలయని ♦ సన్నుతి జేసెదవంచు నాహిర
ణ్యకశిపు డాత్మజున్ వ్యథల♦నారటఁ బెట్టనృసింహరూపమె
త్తి కఠినమానసున్ దునిమి♦దివ్యపదంబును బాలుకిచ్చు పా
వకసమతేజు శ్రీహరు డ♦వారితప్రేమను నన్ను గావుతన్!

చ॥ అమలయశోన్నతిన్ బలిశు♦భాస్పదదానుని వామనాకృతిన్
సమతను వీడుచున్ త్రిపద♦స్థానము దానముఁ గోరి విశ్వరూ
పమును ధరించి భూమి నొక♦పాదము విష్ణుపథంబునందు రెం
డమరఁగ మూటభూతలిఁ గ♦డంచిన వాని నమస్కరించెదన్.

మ॥ ఖగరాడ్వాహన మున్ను ద్రౌపదినిదు♦ష్కారవ్యవంశాధముం
డగు దుశ్శాసనుఁడన్నయాజ్ఞగొని పు♦ట్టంబొల్వ బో నోహరీ
వగనేచన్ తపియింతుఁ బ్రోవుమన స♦ద్భావంబున న్నక్షయం
బగునీకంచుభయంబుమాన్పవె వధూ♦మానంబుగాపాడి నీ
దగు చారిత్రము చాట నావిధిగ స♦ద్దాక్షిణ్యతన్ జూడవే!

చ॥ కరివరదా ముకుంద వర♦కాంచనచేల వికుంఠవాస శ్రీ
ధర భుజగేంద్రశాయి పటు♦దానవహంతక పద్మలోచనా
గిరిధర భక్తవత్సల సు♦కీర్తి సులక్షణ సుప్రసిద్ధ మా
వర సురసేవ్యమానపద ♦ వారిజ భద్రగిరీశ రాఘవా!

చ॥ నరహరిరూప దైత్యకుల♦నాశన భూరిదయాసముద్ర మం
దరగిరిధారణా సతత♦ధర్మవిచక్షణ దీనపోషణా
మురహరముక్తిదాయక య♦మోఘవిదారితకీర్తిసాంద్రమా
వరసురసేవ్యమానపద♦వారిజభద్రగిరీశ రాఘవా!

ఉ॥ కోటిరవిప్రభావ ముని♦కోటిహృదబ్జనివాస దేవపా
పాటవిదాట తోవ నిను ♦ బల్మరునమ్మిన వారికెల్ల బల్
మేటివరంబులీవ సిరి ♦ మేనను నిల్పినవాఁడ వీవ నీ
సాటికి వేల్పువీవ కడు ♦ సాగిలి మ్రొక్కుచు నుంటిగా చలం
బేటికి దాసుగావ భవ♦భీతిఁ దొలంగగ నిందిరాధవా!

ఉ॥ ఎవ్వడు నిర్వికారుడు ని♦జేశుడు యెవ్వడు నిర్గుణాత్మకుం
డెవ్వడు సృష్టికాదిగుణు♦డెవ్వడు సర్వచరాచరంబులం
దెవ్వడు భూతమానసచ♦రిష్ణు డనఁదగు సర్వసాక్షి యా
నెవ్వడు వానిగొల్తు నను ♦ నేలఁగ మేలగునట్టి భక్తితోఁ!

మ॥ భువనంబుల్ పదునాల్గుతారకగణం♦బుల్సూర్యచంద్రుల్ శచీ
ధవుడున్ దండధరుండుమాపతిసురల్♦దైత్యుల్ దిశభ్రాత్రులుం
బవలున్వాయువునగ్ని పర్వతనదుల్♦పక్షుల్ మృగంబుల్ పసుల్
తవకుక్షిఁ నిలుపంగ జేసిన మహా♦త్మా నిన్ను ధ్యానించెదఁ

ఉ॥ క్షీరపయోధియందున వి♦శేషముగా వటపత్రశాయివై
జేరి ముదంబుతోఁ బ్రకృతి♦చిత్రములఁ దిలకించుచిన్మయా
కారగుణా యనారతసు♦ఖంబగు మార్గముఁ గాంచ జాలకే
తీరుఁ జరించుచుంటినను ♦ దివ్యమతిఁ గనరా ముదమ్మునఁ.

సీ॥ నీలమేఘచ్ఛాయ ♦ నెగడు దేహము వాడు
భానుదీప్తిని మించఁ ♦ బరగు వాడు
శీతాంశుకళ మించు ♦ చెలువు గుల్కెడి వాడు
యరవిందదళనేత్రు ♦ డైన వాడు
శంఖు చక్రము గల్గి ♦ జగతి సుగతిగఁ జొన్ప
సిరి నురంబున దాల్చి ♦ మురియు వాడు
పన్నగేంద్రంబు పై ♦ బవ్వళించెడు వాడు
భక్తాఘములఁ బాపు ♦ శక్తివాడు
గీ॥ వేద వేదాంత వేద్యుడై ♦ వెలయు వాడు
మూడు మూర్తుల కెల్లను ♦ మొదటి వాడు
విశ్వమంతయు దాసయై ♦ వెలుఁగు వాడు
సిరుల నొనగూర్చి నన్ను ర♦క్షించు గాత !

సీ॥ దశరథ రాజేంద్ర ♦ తనయుడై జన్మించి
యెవ్వాడు ప్రఖ్యాతి ♦ నిలను గాంచె
గాధిరాట్పూనతి యా♦గంబు జెర్చు సుబాహు
నెవ్వాడు వధియించి ♦ యేలెఁ గ్రతువు
శివుని విల్విరచియు ♦ సీతను బెండ్లాడి
పరశురాము నెవండు ♦ భంగపరచె
తన తండ్రి యాజ్ఞచే ♦ జని వనంబునకు ముఁ
రావణు నెవడు మా♦రణ మొనర్చె

గీ॥ అట్టి శక్తి సమర్థు, నంనాది పురుషు
నఖిలభూతమయోపేతు • డన జరించు
శ్రీరమాకాంతు నుతియింతు • చిత్తమందు
యీప్సితార్థంబు లిచ్చి రంక్షించుకొరకు.

శ్రీ భక్తిరసస్తోత్ర పద్యావళీ సమాప్తము.

---

# భజనకీర్తనలు.

## 1 వ కీర్తన.

దేవగాంధారి రాగము] [ఝుల్మాతాళము

1 జాలముయేలనుర । నీలమేఘశ్యామ । నీలమేఘశ్యామ ।
నిన్నె నమ్మితి రామ ॥జాలము॥

2 మత్స్యావతారుడవై । ముచ్చుసోమకుని దుంచి । పచ్చ
రితి వేదములను । దెచ్చి బ్రహ్మ కివ్వలేద ॥జాలము॥

3 కూర్మరూపంబు దాల్చి । కుహారంబు ధరియించి । కుంగ
కుండ జలధియందు । గుణనిధీ నిలుపలేద ॥జాలము॥

4 వరహావతార మొంది । సరగున హిరణ్యాక్షు దున్మి । ధరణి
గాచి తిరముగాను । వరమతీ నిలుపలేద ॥జాలము॥

5 నరహరీయనగ బుట్టి । పరమకిరాతు దుంచి । విరివిగాను
ప్రహ్లాదున । కొరము లొసగి జోవలేద ॥జాలము॥

6 గుజ్జురూపమును దాల్చి । కోరరాని కోర్కెల గోరి । దుగ్ధను డంచును బలిని । నిర్జింపలేద మున్ను ॥జాలము॥
7 భార్గవరాముడ వయ్యు । నిర్గమించి నృపులనెల్ల । స్వర్గంబు కంపి క్షితిని । శాంతి బొందింపలేద ॥జాలము॥
8 హలాయుధుండ వయ్యు । అలనా డాదనుజులను । వీలు జూచి నెందరినో । కాలుపురి కంపలేద ॥జాలము॥
9 దశరథాత్మజుడ వయ్యు । ధరణిజవివాహమాడి । దశదిశల పేరుగాంచి । దశముఖుని దుంపలేద ॥జాలము॥
10 బుద్ధావతార మొంది । శ్రీద్ధబూని హింసకూడ । దిద్దిమె పరమార్థ మనుచు । బౌద్ధమతము నిల్పలేద ॥జాలము॥
11 కలియుగమందు నేను । కల్కిస్వరూపుడనై । యిలను జన్మించి ప్రజల । నెల్ల బోషింతు ననలేద ॥జాలము॥
12 ధరణిలో దమ్మాలపాటి । పురవాసి పత్రిపాటి । వరముక్తే శ్వరదాసును । కరుణబ్రోచు రామదేవ ॥జాలము॥



## 2 వ కీర్తన.

బిలహరి రాగము] [రూపకము తాళము

1 రామ నీసమానులైన । రాజులు గల రేయుగమున ॥రామ॥
2 కౌశికమునియాగంబును । గాచి సుబాహు నడచి యా । కాశనదీపరివాహధరు । కార్ముక ముద్ధతి దుంచిన ॥రామ॥
3 క్షితిసుత వివాహమాడి । క్షితిని రాము గెలచి సుర । క్షితముగాను నుండ కైక । ప్రీతినజేసి దశరథుండు । సుత

విపినము జేరు మన్న । మతి నిడి జనకాజ్ఞను భూ । సుతసౌ
మితుౄలగూడియు । నతిముదమున దరలినట్టి ॥రామ॥

4 జానకిని గోలుపోయి । కాననమున వెదకుతరిని । భాను
సూను చెలిమి వడసి । పవనతనయు నాదరించి । వాలిని
గోలలచేతను । కాలుపురి కంపి రాజ్యము । నేలు మనుచు
సుగ్రీవుక । మేలును సమకూర్చినశ్రీ ॥రామ॥

5 కాముకుడౌచును రావణు । డామహాసీతను జెరగొన । ధీమ
మొప్ప కపులగూడి । ఓమహాత్మ వార్ధిదాటి । క్షేమంబున
లంకాపురి । జేరి దనుజు బరిమార్చియు । ఆమెయిదశ
ముఖుతమ్మున । కారయ రాజ్యమొసంగిన ॥రామ॥

6 పవనతనయు డాదికపుల । సవినయముగ లక్ష్మణుని । అవని
జాత గొం చయోధ్య । నరిగి ప్రజల బ్రీతిసల్పి । భువి
పరిపాలన సల్పుచు । భూరియశము గాంచిన శ్రీ । ధవ ము
నిజనవందిత కడు । భవనాశనకారణ రఘు ॥రామ॥

7 ధరణిలో దమ్మాలపాటి । పురమున నివసించునట్టి । వరదా
కోదండపాణి । వాంఛితముల దీర్చునామి । సిరు లొన
గూర్చియు ముక్తే । శ్వరదాసును సతతంబును । కరుణ
జూచి రక్షింపుము । కాంచనచేలాభరణ ॥రామ॥

---

3 వ కీర్తన.

దర్బారు రాగము] [ఆట తాళము.

1 రఘుకులచంద్ర శ్రీరామా మమ్ము । రక్షించు మెపుడు
పరంధామా ॥రఘు॥

2 సకలచరాచరములను భూత । సంఘంబులను దేవతలను,
అకలంకముగ కుక్షి । యందు నిల్పిన దేవ । అఘము బాపి
యు మ । మ్మాదరించుము తండ్రీ ॥రఘు॥

3 పతితపావననామ రామ కమల । భవుజనక శ్రీసీతారామా ।
మును నహల్యకు శాప । మును బాపి కీర్తిచే । వరలిన
నయోధ్య । వాస శ్రీరఘురామా ॥రఘు॥

4 సంతతమై కంఠనిలయ రాక్ష । సాంతక నామధౌరేయ ।
పంతముతోడుత । బహురాక్షసావళి । సంతతపురి కంపి ।
నట్టి జలజాతాక్ష ॥రఘు॥

5 శంఖుచక్రము దాల్చువీరా ని । శ్శంకభక్తుల బ్రోచుధీర ।
బింకములేల నా । వంకజూడుము సామి । సంకటముల
బాపి । సంరక్షించగదయ్యా ॥రఘు॥

6 ధరణిలో దమ్మాలపాటి పుర । వరమున నివసించు మేటి ।
విరివిగ ముక్తే । శ్వరదాసు నెప్పుడు । వరము లొసగి
బ్రోచు । వరదా కోదండపాణి ॥రఘు॥



## 4 వ కీర్తన.

సురట రాగము] [రూపక తాళము

1 కరుణను నను బ్రోవుమయ్య । పురుషోత్తమ శ్రీరామ ॥కరు॥

2 మౌనివరులహృదయకమల । మందున నివసించుభక్త ।
గణముల భవబంధముల సు । గుణనిధి నిన్ దలచుమాత్ర।

మున దెగ్రెంచియు వరము లొసగి । ననవరతంబును బ్రో
తువు । వనజోద్భవవక్షస్థల । మున దాలిచినట్టి దేవ ॥కరుణ॥

3 సాధుమూర్తి కరిరాజా । హ్లాదమున సాగరమున । నీదు
లాడు తరిని మకరి । పాదములను బట్టి యెంతో । వేదన
గలిగించిన ని । న్నోదయానిధే యని కరి । ఖేద ముడిగి
ప్రార్థించిన । నాదుర్మార్గుని దునిమితివె ॥కరుణ॥

4 పాకశాసనుండు మున్చి । కాకు పరచ గోగోపుల । వీక
మెరుగు రాలవాన । భీకరగతి వర్షింపగ । నీకు గలినట్టి
బలము । నీలీలలు జూపగ గో । గోకులులకై నగమెత్తియు ।
ప్రాకటముగ రక్షింపవె ॥కరుణ॥

5 భాసమానముక్తేశ్వర । దాసు నిన్ను దోసిలొగ్గి । గాసి
దీర్చు మనుచు వేడ । కనికరంబు జూపనేమి । ఈసును
బూనియు నిపుడీ । దాసును మరి బ్రోవకున్న । శేషశయన
నాదగు హృత్సీమను నిను బంధించెద ॥కరుణ॥



5 వ కీర్తన.

హిందూస్థానిముఖారి రాగము] [జంపెతాళము

1 గోపికలోల శ్రీ । గోపాల జాలమేల ॥గోపిక॥

2 నీదుపాదకమలములను । నిశ్చలమానసమున నే । పాదు
కొల్పి గొల్చువాడ । సాధుమూర్తి కరుణజూడు ॥గోపిక॥

3 తనివి సనదు మున్ను గల్గు । తావకకథ తెన్ని విన్న ।
తండ్రి వనుచు నమ్మినాడ । దర్శన మీయుము వేగ ॥గో॥
4 అడుగుమడుగు లిడుచు విప్ర । వడుగువయ్యు బలిని
మూ । డడుగు లవని దాన మడిగి । పాడవడంచినట్టి
ప్రోడ ॥గోపిక॥

5 కురుకులవర్గంపుకొలువు । కూటంబున పాంచాలిని । పరిభ
వంబు నందకుండ । వరములొసగి గాచినట్టి ॥గోపిక॥

6 వాసిగ దమ్మాలపాటి । వాసుడైన ముక్తేశ్వర । దాసు
నెపుడు బ్రోచునట్టి । వాసవాది సురవందిత ॥గోపిక॥



## 6వ కీర్తన.

హిందుస్థాని తోడిరాగము] [జుల్మాతాళము.

1 చిన్నికృష్ణ । నిన్ను నెన్నగ , తరమాన యేరికె ॥చిన్ని॥
2 చన్నుగుడిపి । నిన్ను నడప । నున్న పూతన యూహనెల్ల ।
గ్రిన్నన గ్రహియించి దుగ్ధము । లన్ని ద్రావి । కన్నె
జంపిన ॥చిన్ని॥
3 తొట్లయందు నూగుతరిని । జట్టి శకటాసురుండు । బట్టి
నిన్ను బోరగాను , గిట్టడంచి , నట్టిదేన ॥చిన్ని॥
4 క్రీడ లనుసరించుబాలు । డేడ నాతో సాటి యనుచు ।
వాడవాడ లెల్ల వెతికి । వచ్చు తృణావర్తు గూల్చిన ॥చిన్ని॥

5 బాలప్రాయమునని కంసు । డాలమునను నిన్ను గూల్ప ।
గ్రోలుచున్నవాని వేగ । కాలుపురి కంపినట్టి ॥చిన్ని॥
6 ధరణిలో దమ్మాలపాటి । పురమున నెలకొనియు వేణు ।
కరముబూని పాటబాడి । విరివి జనులముదముదము గూ
ర్చెడి ॥చిన్ని॥
7 వాసిమీర ముక్తేశ్వర , దాసు నెపుడు బ్రోచునట్టి ।
వాసవాదిసురవందిత । భాసమాన । విలాసదేహ ॥చిన్ని॥



## 7వ కీర్తన.

బేహాగ్ రాగము] [ఆటతాళము

1 వసుదేవ, నంద, నా, ముకుంద । వారిజాక్ష భూధవా ॥వ॥
2 పరా, త్వరా, హరే, మురారి । పాండువంశ, రక్షకా ॥వ॥
3 హే, కంసాసురమర్దనా । హే, కాళీయనృత్యవర్ధనా ।
ముల్లోక, పూజి, తా, బకాది । మూర్ఖరాక్షసాంతకా ॥వ॥
4 యదువంశ, తిలక, గోపబాల । యింతపంత, మేలరా ।
హే, ముచికుందు, మోక్షనాధనా । హే, మృదువేణు
నాదప్రియా । హే, యశోదాసుతా । కరుణ జూడ । వర
ము లివ్వరా । కమ్మవిల్తుని, తండ్రి, బ్రోవరా । దీనరక్షణా,
దాసపోషకా, గావుము, మమ్ము, కృపతో ॥వ॥
5 ముక్తేశ్వర, దాసుని, సతము । ముదముతోడ గావుమా
॥వసుదేవ॥



## 8. మంగళహారతి.

సురట రాగము] [ఆదితాళము.

1 మంగళ మిదె గొనుము శుభగచరితా । మాధవ యదు వంశతిలక హరి ॥మంగళ॥

2 మత్స్యకూర్మవరాహనారసిం । హశ్చ వామనరూపరా । మశ్చ రామరామాదిబౌద్ధగుణ । మాన్యగోపగోవర్ధన రక్షిత ॥మంగళ॥

3 క్షీరవార్ధిశయన పద్మగర్భవి । దారిత దానవహరణా । క్రూరకంసపూతనాదిమారణ । మారజనక మధురాపురి వాసక ॥మంగళ॥

4 నందనందనా సనకసమునిజన । వందిత యిందిరరమణా సం । క్రిందనాభిధాన భక్తపోషణ । బృందావనపాలిత కేశవ జయ ॥మంగళ॥

5 ఖగవాహన శంఖుచక్రధారణ । కాంచనచేలా భరణా । నృగరాజశాపమోక్షసాధనా । నిగమాంతవేద్య సుగుణాల వాల జయ ॥మంగళ॥

6 ధరణిలోన ముక్తేశ్వరదాసును । కరుణజూచి బ్రోచునట్టి దశరథ । వరకుమారరామచంద్ర నీ కిడు , విరివి కర్పూర హారతు లివె గను ॥మంగళ॥

భజనకీర్తనలు సమాప్తము.

సర్వము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

